# తెనాలి రామకృష్ణ




అనువాదం:

శ్రీమతి పి. రాధా చలపతి

ప్రధాన సంపాదకులు:

(మూలరచన)

ఎల్. ఎస్. శేషగిరిరావు


భారత భారతి పుస్తక మాల

(తెలుగు సంస్కరణ)

*3-4-852, బర్కత్‌పురా, హైదరాబాద్ - 27.*

ప్రచురణ కర్తలు:
నవభారతి ప్రచురణలు
పోస్ట్ బాక్స్ నెం.1041
నారాయణగూడా, హైదరాబాద్-29.

తెలుగు సంస్కరణ సంపాదకులు:
టి. హరిహరశర్మ

ప్రథమ ముద్రణ: సెప్టెంబరు, 1991

వెల: రూ. 4.00

ప్రతులకు:
సాహిత్యనికేతన్
3-4-852, బర్కత్‌పురా,
హైదరాబాద్ - 27.

# ఇది మా మాట

కేవలం భారత దేశంలోనే కాక, మొత్తంప్రపంచం లోనే ప్రఖ్యాతులైన మన పూర్వీకులను స్మరించడం, వారి జీవితాలను అధ్యయనం చేయడం ఎల్లప్పుడూ ప్రేరణదాయకంగాను, మార్గదర్శకంగాను ఉండగలదనడంలో సందేహంలేదు.

మన చరిత్రకే వన్నెతెచ్చిన ఆ మహనీయుల జీవితాలను సరళమైన, ఉత్తేజకరమైన భాషలో ప్రజలకందించే చక్కని ప్రయత్నాన్ని రాష్ట్రోత్థాన పరిషత్, బెంగుళూరు వారు ప్రారంభించారు.

"నవభారతి" ఆ పుస్తకాలను తెలుగులోకి అనువదించే బృహత్కార్యాన్ని చేపట్టింది. భారత భారతి పుస్తకమాల రూపంలో మీ చేతుల్లో ఉన్న పుస్తకాలు ఆ ప్రయత్న ఫలితమే. మన చరిత్రలోని మహాపురుషుల జీవితాలు ఈ పుస్తకమాల ద్వారా మీకందించబడతాయి.

అమరమైన, అనంతమైన మన గత చరిత్ర అనే అమృత స్రోతస్సును తరువాతి తరానికి అందించగలుగుతున్నామనే సంతృప్తితో ఈ పుస్తకాలను మీ ముందు పెడుతున్నాం. మీరు కూడా ఈ కృషిని ప్రశంసించగలరని, ప్రోత్సహించగలరని ఆశిస్తాను.

మూల రచనను సరళమైన, ఆహ్లాదకరమైన రీతిలో తెలుగులోకి అనువదించిన అనువాదకులకు ధన్యవాదాలు.

హరిహర శర్మ
సంపాదకులు.

# తెనాలి రామకృష్ణ

జగమెరిగిన హాస్యకవి తెనాలి రామకృష్ణుడు. అతడి హాస్య చాతుర్యం గురించి, తెలివితేటల గురించి లెక్క లేనన్ని కథలు ప్రచారంలో ఉన్నాయి. అనాథగా, నిరుపేదగా జీవితాన్ని ప్రారంభించిన రామకృష్ణుడు తన స్వశక్తితో ఒక శక్తివంతుడైన రాజుకు అతి ప్రియుడైన సలహాదారుడి స్థాయికి ఎదిగాడు. విద్వాంసుడు, కవి అయిన రామకృష్ణుడు మూఢవిశ్వాసాలను ఖండించాడు. వ్యక్తులలోని అహంకారాన్ని, మదాన్ని చిత్తుచేశాడు.

# తెనాలి రామకృష్ణ.

బాలలూ! జంతువులు నవ్వటం మీరెప్పుడైనా చూశారా? ఊహూ.. చూసివుండరు? జంతువులు నవ్వలేవు, కాని మనుష్యుల్లాగే అవీ దుఃఖిస్తాయ్! కంటతడిపెడతాయ్! మనుషులు ఏడవగలరు, నవ్వగలరు!

నవ్వినపుడు మనస్సుకి హాయి కల్గుతుంది. హాయిగా నవ్వితే మనస్సు తేలికపడుతుంది. నవ్వుకొత్తవుత్సాహాన్ని నింపుతుంది-మనస్సులో. అందరు నవ్వగలరు, కానీ ఇతరులను నవ్వించగల నేర్పు కొందరికే వుంటుంది. అందులో ఒక రాజుగారిని ...., అనేకబరువు బాధ్యతలు కల్గి, ప్రజలను పరిపాలించే రాజుగార్ని వినోద పర్చాలంటే ప్రత్యేక ప్రతిభవున్నవారికే సాధ్యమవుతుంది.

మనిషి స్వభావాన్ని ప్రతిబింబింపచేస్తుంది అతని నవ్వు! ఏ పరిస్థితిలో నవ్వగలడు? ఎవరిని చూసి నవ్వగలడు? నవ్వుని బట్టి అతని మనస్తత్వాన్ని అంచనావేయవచ్చు. మనస్సు పరిపక్వతను తెలుసుకోవచ్చు. కుంటివాల్లను, గుడ్డివాళ్లను చూసిన వ్వేవారు, రోడ్డుమీద కాలుజారి పడినవాడిని చూచి

నవ్వేవారు మూర్ఖులు! వారి మనస్సు ఇంకా ఎదగ లేదని చెప్పవచ్చు. గర్వోక్తి నవ్వు ఇతరుల మనస్సు నొప్పిస్తుంది. నవ్వించి ఇతరుల మనస్సుకి మేలు చేయగల్గేది నిజమైన హాస్యము! మేధలోనుండి పుట్టే నిజమైన హాస్యము అమృతంచిలికిస్తుంది!

పూర్వకాలములో ఆస్థాన విదూషకులుండేవారు. వాళ్లు తమ హాస్య సంభాషణలతో రాజుగార్ని వినోద పరిచేవారు. అలాంటి విదూషకులలో ప్రసిద్ధి పొందిన వాడు తెనాలి రామకృష్ణ! ఎలాంటి పరిస్థితిలోనైనా సందర్భానికి తగినట్లుగా హాస్యం చిందించి, చతురోక్తులతో రాజుగారినే కాదు, సభలోని వారినందర్ని నవ్వించేవాడు. అలా హాస్యముతో నవ్వించేవాడిని 'సాక్షాత్తు తెనాలి రామకృష్ణుడే' అంటూ పొగుడుతూవుంటాంకదూ!

## "పూర్తి స్వేచ్ఛ లభించింది"

పదహారో శతాబ్దపు ప్రారంభంలో ఆంధ్రరాష్ట్రానికి చెందిన 'గార్లపాడు' అనే గ్రామములో రామకృష్ణుడు జన్మించాడు. (తెనాలిలో జన్మించాడని కొందరంటారు) బాల్యములోనే తండ్రి రామయ్య చనిపోవటంతో తండ్రిప్రేమకు నోచు

కోలేదు. తల్లి లక్ష్మమ్మ తన స్వగ్రామమైన తెనాలికి వెళ్లిపోయి అన్నగారింట్లో వున్నది. రామకృష్ణ అక్కడే పెరిగి పెద్దవాడవడం వల్ల తెనాలి రామకృష్ణగా పేరుపొందాడు. రామకృష్ణని బాగాచదివించాలని తల్లి ఆశపడింది. ఆరోజుల్లో వైష్ణవమతం బాగా ప్రచారంలో వుంది. ఆగ్రామంలో వున్న వుపాధ్యాయులంతా వైష్ణవులే! వాళ్లంతా రామకృష్ణకి చదువుచెప్పటానికి తిరస్కరించారు. కారణం! రామకృష్ణ శైవమతానికి చెందినవాడు కావటమే! ఆరోజుల్లో శైవ, వైష్ణవమత సామరస్య భావనలేదు-ఒకరి నొకరు ద్వేషించుకునేవారు.

ఇక రామకృష్ణకి పూర్తి స్వేచ్ఛ లభించింది. ఉదయంనుండి రాత్రివరకు స్వేచ్ఛగా తోటలవెంట తిరగటమేపని. చెడు సావాసాలు చేస్తూ, మామిడి కాయలు, జామపండ్లు, చింతకాయలు దొంగతనంగా కోసుకుతింటూ కాలక్షేపం చేసేవాడు.

కుటుంబం దుర్భర దారిద్ర్యంలో మునిగివుంది. ఉన్న ఒకకొడుక్కీ చదువుసంధ్యలు లేవు, సంపాదన లేదు. తల్లే ఆయింటా ఈఇంటా పనులు చేస్తూ కుటుంబాన్ని పోషించేది.

## చదువులో ఆసక్తి:

అప్పటికి రామకృష్ణ వయస్సు పది సంవత్సరా లుంటాయేమో! కొంత ఆలోచనా పరిజ్ఞానము పెరిగింది. ఆరోజుల్లో విద్య అంటే వేదాలు వల్లిం చటం, ఉపనిషత్తులు, పురాణ గ్రంథాలు చదవటమే! ఆగ్రంథాలు తానొక్కడు చదవగలడా? కనీసం ఉత్త రాలు కూడా చదవలేడు. తలుచుకుంటే రామకృష్ణకి దుఃఖం కల్గుతోంది! ఒక్క అక్షరం కూడా వ్రాయ టంరాదంటే సిగ్గుగా కూడా వుంది. ఎలాగైనా చదువుకోవాలన్న తపన ఆబాలుడిలో కల్గింది.

అనేక మంది పండితులను కలుసుకున్నాడు.

"నన్ను మీ శిష్యుడిగా స్వీకరించండి. మీకు సేవ చేస్తూ మీఋణం తీర్చుకుంటాను" అంటూ ఎంతో దీనంగా బ్రతిమాలాడు రామకృష్ణ. అందరూ తిట్టి, బయటికి గెంటివేశారే తప్ప ఒక్కరు కూడా ఆశ్రమము లోగాని, బడిలోగాని చేర్చుకోవటానికి సమ్మతించలేదు.

ఆఖరికి ఆగ్రామములోవున్న కొద్దిమంది శైవపం డితులని కూడా కలుసుకున్నాడు. వారు రామకృష్ణుడి మొర విన్నారు. కానీవారు కూడా తిరస్కరిం చారు. ఎంతోపాండిత్యం గడించికూడా పేదరికంతో

మగ్గుతూ వున్నారువాళ్లు. విసుగెత్తి, 'ఎందుకొచ్చి నచదువులు హాయిగా ముష్టెత్తుకుని జీవనంసాగించ మని' సలహాయిచ్చారు. చాలానిరాశ పడిపోయాడు రామకృష్ణ!

## 'నేనే చదువుకోగలను! మీరేం చెప్పనవసరం-లేదు:'

రామకృష్ణకి చాలాకోపంవచ్చింది. ఎంతో నమ్మ కంగా ఆశపడి వెళ్లాడు. వాళ్లుతిరస్కరించారు! విద్యచెప్పలేని వీరిపాండిత్యం ఎందుకు? అది వృథా! అనుకున్నాడు. ఇక చదువు గురించి ఎవరినీ ప్రాధేయ పడకూడదని నిశ్చయించుకున్నాడు. తనంతట తానే విద్యను గడించాలని తీర్మానించుకున్నాడు.

"అమ్మా! నన్ను ఆశీర్వదించు విద్య నభ్యసిం చటానికి వెళ్తున్నాను" అన్నాడు తల్లి కాళ్లకు నమస్కరిస్తూ. ఆమాటలకి తల్లి ఎంతో సంతో షపడిపోయింది. ఇన్నాళ్లకి ఒక మంచి గురువు దొరికివుంటారని అనుకుంది. కొడుకుని మనస్ఫూ ర్తిగా ఆశీర్వదిస్తూ ఇలాఅన్నది.

"అన్ని విషయాలలో విజ్ఞానము సంపాదించి

గొప్పపండితుడివికావాలి నాయనా!"

రామకృష్ణ ఏగురువుదగ్గరికీ వెళ్లలేదు. ఆగ్రామములోవున్న పాఠశాల గోడే అతని గురువు. రోజూ ఉదయం ఆగోడదగ్గరకి వెళ్లి నిలబడేవాడు. లోపల తరగతిలో గురువుగారు చెప్తున్న పాఠాలన్నీ శ్రద్ధగా వినేవాడు. సాయంత్రం బడివదలగానే ఇంటికి వచ్చి, తను విన్న పాఠాలన్నీ తల్లిముందు ఏకరువుపెట్టేవాడు. అలా అభ్యాసంచేస్తుండేవాడు ప్రతిరోజు!

## 'అలా వినటానికి వీల్లేదు'!

అలా పాఠాలు వినే అదృష్టం కూడా ఎన్నాళ్లో దక్కలేదు రామకృష్ణకి. ఒకరోజు అలా నిలబడివున్నప్పుడు తరగతిలోని ఒకబాలుడు చూచాడు. "దొంగ! దొంగ!!" అంటూ కేకలుపెట్టాడు. విద్యార్థులు, ఉపాధ్యాయులంతా రామకృష్ణ చుట్టూచేరారు.

గురువుగారికి కోపం వచ్చింది. "పనిలేకుండానే ఆ గోడపక్కన నిలబడ్డావా?" అని ప్రశ్నించారు.

గురువుగారి కాళ్లమీదపడిపోయి ఏడుస్తూ, "చదువుకుందామని ఇక్కడనిలబడ్డాను" అంటూ దీనంగా తనకథనంతా ఏకరువుపెట్టాడు. చదువుకోవాలన్న



"చదువు నేర్చుకోవాలని ఇక్కడ కూర్చున్నాను"

ఆపిల్లవాడి తపన, గురువు దొరక్క పడిన బాధలు విని ఆగురువుగారికి ఎంతో సానుభూతి కల్గింది. గర్వమూ కల్గింది! కాని ఏంలాభము? ఆయనకీ స్వేచ్ఛలేదు! ఆయనకూడా ఛాందసుడే.

"నాయనా! నీలాంటి శిష్యుడు దొరకటం ఎంతో అదృష్టమనే చెప్పాలి. నీకు విద్య నేర్పించాలనే వుంది. కానీ నిన్ను శిష్యుడిగా స్వీకరిస్తే నన్ను వెలివేస్తారు. నీవు ఈ పాఠశాల ఛాయలకి కూడా రావద్దు. ఎవరైనా నీకు హాని కల్గించవచ్చు. మనస్ఫూర్తిగా ఆశీర్వదించటం తప్ప నేనేమీ చేయలేను. కాని నీవొక గొప్ప విద్యావంతుడివి కాగలవని నాకనిపిస్తోంది" అంటూ రామకృష్ణుని ఆశీర్వదించి అక్కడనుండి వెళ్లిపోయారు.

## రామకృష్ణుని కథలు:

ఆ గురువుగారు రామకృష్ణను బడిదగ్గరకి కూడా రావద్దని చెప్పి ఆశీర్వదించి వెళ్లిపోయారు కదా? అలా వెళ్లిపోయాక రామకృష్ణకి ఏంచేయాలో తోచలేదు. తన దురదృష్టానికి తననే నిందించుకున్నాడు. దారీ తెన్నూ తెలియక అలా నడుచుకుంటూ దట్టమైన అడవిలోకి వెళ్లిపోయాడు. నడిచి నడిచి బాగా అల

సిపోయాడు. పాడుపడిన ఒక పాత భవనంముందు కూలబడి ఏడవటం ప్రారంభించాడు.

సరిగ్గా ఆసమయములోనే అక్కడికి ఒక సాధువు వచ్చాడు. "నాయనా! ఎవరు నువ్వు? ఇంత భయంకరమైన అడవిలోకి ఎందుకొచ్చావు? ఎందు కేడుస్తున్నావు? ఏంకష్టం వచ్చింది? చెప్పు! నేను చేయగల సహాయం ఏదైనా చేస్తాను!" అని అడిగాడు.

రామకృష్ణ ఆసాధువు కాళ్లను గట్టిగా పట్టుకుని ప్రాధేయపడుతూ అన్నాడు!

"మహానుభావా! నాకుతల్లి తప్ప ఎవరూలేరు. చదువురానివాడు కాకి, గ్రద్దకన్నా హీనం అని నా తల్లి చెప్పింది. కాని మాగ్రామములో ఎవరూ కూడా నాకు చదువు చెప్పటానికి సిద్ధంగాలేరు. దయచేసి మీరు నన్ను శిష్యుడిగా స్వీకరించి విద్యనేర్పమని వేడుకుంటున్నాను"

"నాయనా! ఈ వయస్సులో చదువు ప్రారంభించి విద్యావంతుడు కావడం కష్టం! కాని నీకొక ఉపాయం చెప్పగలను. ఆప్రకారముగా చేస్తే నీ కోరిక తీరుతుంది" అన్నాడు ఆ సాధువు.

"అదిగో! అక్కడ కాళికాదేవి ఆలయం వుంది. నీవుభక్తితో ఆమెను, కొలిచి ఆమె దయ పొందా వంటే ఆమె ఎన్నో వరాలనిస్తుంది. నీకు కొన్ని మంత్రాలను నేర్పిస్తాను. పదకొండు కోట్లసార్లు భక్తితో జపించితే ఆతల్లి ప్రత్యక్షమౌతుంది. కాని ఆమె భయంకరరూపం చూచి ఏమాత్రం భయపడకూడదు! కాళికామాత ఆశీర్వదిస్తే నీవు గొప్ప విద్యావంతుడివి కాగలవు. నీకోరిక తీరుతుంది" అంటూ రామకృష్ణుని చెవిలో మంత్రాలనుపదేశించి, వెళ్లిపోయాడు.

## కాళికాదేవి భక్తుడు:

రామకృష్ణ చెఱువు దగ్గరికి వెళ్లి స్నానం చేశాడు. పువ్వులు, ఆకులు కోసుకుని కాళికాదేవి గుడిలోకి వెళ్లాడు.

"జై మహాకాళీ! జైజై కాళీమాత" అని మంత్రాలనుజపిస్తూ ఆ పువ్వులను, ఆకులను ఆమె పాదాలమీద చల్లి, ఆమె ముందు సాష్టాంగ పడిపో యాడు. తర్వాత లేచి, కాళికాదేవి విగ్రహంముందు పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు.

ఏకాగ్రతతో కళ్లుమూసుకుని ధ్యానిస్తూ మంత్రా

లను వల్లించటం ప్రారంభించాడు. దీక్షగా కొన్ని రోజుల పాటు సాగించాడు!

అది పాడుపడిన దేవాలయం కావటంవల్ల అక్కడ పాములు, తేళ్లు, గబ్బిలాలు మొదలైన అనేక పక్షులు, క్రిమికీటకాలు నివాసం ఏర్పరచుకున్నాయి! పాములు యధేచ్ఛగా అతని వంటి మీద ప్రాకుతున్నాయ్! పక్షులు ముక్కుతో పొడవటం ప్రారంభించాయ్!! విషక్రిములు, కీటకాలు కరుస్తున్నాయ్!!! ఆపరిస్థితిలో మంత్రాన్ని పదకొండుకోట్ల సార్లు పఠించటం ఎంతో కష్టం అయినా రామకృష్ణ కదలకుండా కూర్చుని ఏకాగ్రతతో ధ్యానిస్తున్నాడు! ఏమాత్రం చలించలేదు. అలాదీక్షగా పదకొండుకోట్ల పద కొండుసార్లు మంత్రాన్ని పఠించాడు. మంత్రపఠనం పూర్తికాగానే కాళికా మాతప్రత్యక్షమైంది! వేయి ముఖాలతో భయం కల్గిస్తోందామె రూపం!!

"రామకృష్ణా! నీ భక్తికి మెచ్చాను. కళ్లుతెరచి చూడు! నీకేం వరం కావాలో కోరుకో" అని చెప్పింది.

నెమ్మదిగా కళ్లు తెరచి, ఆమెవంక చూచిన రామకృష్ణుడు "ఎవరమ్మా నీవు?" అంటూ ప్రశ్నించాడు ఎంతో అమాయకంగా.

"నేను కాళికాదేవిని. ఎవరికోసమైతే నీవు పద కొండురోజులనుండి ఏకాగ్రతతో ధ్యానిస్తున్నావో ఆ దేవతను. నీభక్తికి మెచ్చి ప్రత్యక్షమయ్యాను" అని కాళి మాత వివరించింది. ఎప్పుడైతే మాత ఆమా టలు అన్నదో వెంటనే రామకృష్ణ కళ్లు మూసుకుని మాత పాదాలముందు సాష్టాంగ పడిపోయాడు. తర్వాత కళ్లుతెరచి ఆమెని తేరిపార చూశాడు! కాని ఏమాత్రం భయపడలేదు, బెదిరిపోలేదు!

ఆమె ఒక మహాశక్తి!!! సింహము మీద అధి ష్టించి వుంది. భయంకరమైన వేయి ముఖాలతో, మండుతున్న వేయి నాలుకలుచాపి, తీక్షణమైన వెయ్యి జతల కళ్లతో ఆమె రూపం భయం గొల్పుతోంది! ఆరూపంచూచి రామకృష్ణ ఏమాత్రం భయపడలేదు. ఆమెని, ఆమె అధిష్టించిన సింహాన్ని కూడ అలాచూస్తుండిపోయాడు. తనరూపాన్ని చూచి భయపడిపోతాడనుకున్న ఆ బాలకుడు ఏమాత్రం భయ పడకపోవటం చూచి కాళీమాత ఎంతో విస్మయం చెందింది! ఆశ్చర్యంగా చూస్తోంది!

**స్ఫురణ:**

హఠాత్తుగా రామకృష్ణ నవ్వటం ప్రారంభించాడు.

అతనివింత ప్రవర్తనకు కాళీమాత ఆశ్చర్యపడుతూ అడిగింది:

"మహామహారాక్షసులే నన్ను చూచి భయపడ్డారు. నీకెంత ధైర్యం?? నన్ను చూచి నవ్వుటయా?!"

"తల్లీ! నీకు వెయ్యిముఖాలున్నాయికానీ రెండే చేతులుండటం చూచి నాకు ఒక విషయం జ్ఞాపకం వచ్చి నవ్వు ఆపుకోలేకపోయాను. నన్ను క్షమించు తల్లీ!" అన్నాడు రామకృష్ణ.

కాళికాదేవికి ఆత్రుత పెరిగింది. అంత నవ్వు కల్గించిన ఆవిషయమేమిటో వెంటనే చెప్పమని ఆజ్ఞాపించింది రామకృష్ణని.

"మాకు ఉన్నది ఒక్కముక్కే జలుబు చేసినపుడు ఉన్న రెండుచేతులతో ముక్కుని తుడుచుకోలేక నానా అవస్థపడ్తాము. కానీ నీకు!... ఉండేవి రెండు చేతులే! కానీ వెయ్యి ముక్కులు!! జలుబుచేసినప్పుడు నీవెయ్యి ముక్కులను తుడుచుకోవటానికి ఎంత అవస్థ పడతావో తలుచుకుంటే నాకు నవ్వువచ్చింది తల్లీ! నేను మర్యాదలేకుండా ప్రవర్తించాను. నన్ను క్షమించు" అంటూ మళ్లీ ఆమె కాళ్లముందు సాష్టాంగపడినమస్కరించాడు. తర్వాత లేచి ఆమె

ముందు నిలబడ్డాడు.

అమాయకమైన ఆబాలుడి నవ్వు, హాస్యధోరణికి కాళికాదేవి ప్రసన్నమైంది. దేనికోసమైతే తపస్సు చేశాడో ఆవిషయం పూర్తిగా మర్చిపోయి, ఎంతో మామూలుగా మాట్లాడే ఆ ధోరణికి ముగ్ధురాలై తనభయంకర రూపాన్ని వదిలి నవ్వింధి కాళికాదేవి! మళ్లీ మళ్లీ నవ్వింది!

"రామకృష్ణా! నన్నుకూడా నవ్వించావు కాబట్టి విద్యావేత్తలకి కూడా గురువుగా రాణిస్తావు! పరిస్థితులకనుగుణంగా మాట్లాడగలవు. విదూషకునిగా ప్రఖ్యాతిపొంది అందరినీ నవ్వించగలవు!! గొప్ప హాస్యకుడిగా, హాస్యకవిగా కూడాపేరు సంపాదించ గలవు!!!" అంటూ ఆశీర్వదించింది.

అంతమాత్రం చేత రామకృష్ణ సంతృప్తి చెంద లేదు. ఎన్నో సందేహాలతడిని పీడిస్తున్నాయి! 'తెనాలిలో ప్రజలు తన హాస్యానికి మెచ్చుకుంటారా? పందిముందు ముత్యాలు చల్లినట్లుగా వుంటుందేమో అక్కడవుంటూ రాజు దృష్టినాకర్షించగలనా?' అన్న ఆలోచనలే బాధపెడ్తున్నాయి.

అతని అనుమానాలను పసిగట్టి నవ్వి, ఇలా

అన్నదికాళికాదేవి: "నాయనా! నీవేం కలతపడకు. వెంటనే విజయనగర సామ్రాజ్యానికి వెళ్లు! వెళ్తే రాజుగార్ని సంతోషపెట్టగలవు! ఆస్థానకవిగా నిన్ను చేర్చుకుంటారు. నా ఆశీస్సులుసదా నీవెంటే వుంటాయి!" అంటూ మాయమై పోయింది.

ఇదీ! రామకృష్ణుని గురించి అందరూ చెప్పుకునే కథ! అసలు పాఠశాలకి కూడా వెళ్లకుండానే పండితుడెలా అయ్యాడన్న ప్రశ్నకి ఈ కథ ప్రచారంలో వుంది. ఇందులో నిజం ఎంత వుందో తెలియదు. కాని శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో అతని ప్రతిభ మెచ్చుకోదగినది. సందర్భానికి తగిన హాస్యాన్ని పుట్టించడం, ఎటువంటి క్లిష్టపరిస్థితుల్లోనైనా అధైర్యపడకుండా, నిరాశ చెందక సాహసంగా ముందుకడుగేయడం — ఈ రెండు ప్రధాన విషయాలలో మాత్రం అతని ప్రతిభను మెచ్చుకోవలసిందే! అందువల్ల అవే పై కథ యదార్థంగా జరిగిందనటానికి సాక్ష్యాలు!

## గోపబాలకుడు:

ఎలాగైతేనేమి, రామకృష్ణ తల్లిని వెంట బెట్టుకుని విజయనగరానికి బయలుదేరి వెళ్లాడు. నగరవైభవాన్ని

వింతగా చూశాడు.

సుఖసంపదలతో వైభవంగా తులతూగుతున్న రాజధానినగరాన్ని ఆశ్చర్యంగా చూశాడు. ఎవరినడిగినా శ్రీకృష్ణదేవరాయల ఔదార్యంగురించి వర్ణించేవారే కన్పించారు. ఎందరో కళాకారులు, పండితులు, వివిధ కళల్లో నిష్ణాతులైన వారంతా రాజుగారి పోషణలో వున్నారు. మేధావులైన వారియెడల రాజుగారు ఎంతో ఔదార్యము ప్రదర్శిస్తాడని విన్నారు.

రాజుగారి దృష్టినాకర్షించటానికి రామకృష్ణఏంచేశాడు? అపరిచితుడైన ఆ వ్యక్తిని రాజుగారికి ఎవరు పరిచయం చేశారు?.... తెలుసుకుందాం!

రాజుగారు కొలువుదీరీ వుండగా తనే సభలోకి వెళ్లి, తన ప్రతిభతోనే రాజుగారి దృష్టి నాకర్షించాలని రామకృష్ణ నిశ్చయించుకున్నాడు. ప్రతిరోజు రాజభవనం ముఖద్వారం వద్ద నిలబడే వాడు, అవకాశం కోసం ఎదురుచూస్తూ

రోజులతరబడి అలానిలబడటం, నిరాశగా ఇంటికి తిరిగి వెళ్లి పోవటం జరిగేది.

ఆఖరికి ఎలాగైతేనేమి ఒక అవకాశం దొరికింది. తంజావూరునుండి నాటకబృందం ఒకటి విజయన

గరం వచ్చింది. వాళ్లు 'కృష్ణలీలలు' అనే నాటకాన్ని రాజుగారి ముందు ప్రదర్శించబోతున్నారని, వాళ్లు కాసేపట్లో కావలసిన దుస్తులు వేసుకుని సభలోకి ప్రవేశించబోతున్నారని రామకృష్ణకి తెలిసింది. అత డికి ఒక వుపాయం తట్టింది. వెంటనే ఇంటికి వెళ్లి, గొల్లపిల్లవాడి వేషం వేసుకున్నాడు. ఒక పెద్ద కవ్వం భుజం మీద పెట్టుకుని ముఖద్వారం దగ్గరికి చేరుకున్నాడు. అప్పటికే ఆలస్యమైంది!

**బహుమతిలో సగం... సగం...!**

నెమ్మదిగా లోపలికి జారుకోబోతున్న రామకృ ష్ణని ఆపాడు ద్వారపాలకుడు పెద్ద పెద్ద మీసాలతో కోపంగా కేకలువేస్తున్నాడు.

"చూస్తే కుర్రవాడివి, పెద్దమనిషిలా వెళ్లిపో తున్నావేమిటి? సభలోకి వెళ్ళటానికి అనుమతి తీసుకోవాలని తెలియదా?" అంటూ గద్దించాడు.

"ఇదిగో నావేషం చూస్తే తెలియటం లేదా? నేను గొల్లపిల్లవాడీని. ఈ కవ్వం చూడు. రాజు గారి ముందు నాటకం వేస్తున్నాం! ఇప్పుడు లోపలికి వెళ్లిన నాటక బృందంలో వాడిని. నన్ను వెళ్ల నియ్యి" అటూ వెళ్లబోతుంటే మళ్లీ అడ్డుపడ్డాడు

వాడు సైంధవుడిలా-

"ఇంత ఆలస్యంగా వచ్చినందుకు అపరాధ రుసుం చెల్లించి మరీవెళ్లు" అన్నాడు.

రామకృష్ణ దగ్గర డబ్బుల్లేవు! తెలివితేటలతోనే తప్పించుకోవాలనుకున్నాడు. "నేను గొప్ప హాస్యగాణ్ణి. నా హాస్యంతో రాజుగార్ని మెప్పిస్తాను. రాజుగారు నాకు ప్రత్యేక బహుమతి నిస్తారు. ఆ బహుమతిలో సగం వాటానీకిచ్చి మరీ వెళతాను. నీకిష్టమేనా?"

ద్వారపాలకుడికి ఆశపుట్టింది. "నిజంగా వాటా ఇస్తావా?" అనడిగాడు. "నిజంగానే ఇస్తాను. నీమీద ప్రమాణం చేసి చెప్తున్నాను" అన్నాడు రామకృష్ణ. "అయితే వెళ్లుగాని మర్చిపోవద్దు నావాటా!" అనగానే సంతోషంగా లోపలికి పరుగెత్తిన రామకృష్ణకి లోపలద్వారం వద్ద మరో ద్వారపాలకుడు అడ్డుపడ్డాడు లోపలకి వెళ్లనివ్వకుండా! పెద్ద పెద్ద మీసాలతో రాక్షసుడిలా వున్నాడు. మొదటివాడిని మభ్యపెట్టినట్లుగానే అతడికి కూడా సగంవాటా ఇస్తానని చెప్పి, ఎలాగైతేనేం నెమ్మదిగా లోపలికి జారుకున్నాడు రామకృష్ణ.

## రామకృష్ణుని కృష్ణలీల!

"కృష్ణలీలలు" అనే నాటకం సాగుతోంది పేల వంగా! గోపకులతో చేరి వెన్న మీగడలను ఆరగించడం, కాళీయమర్దనం పూర్తయినట్లుంది. రాక్షస సంహారం జరుగుతోంది. దేవికాసురుడనే రాక్షసుడిని, శక్త్యాసురుణ్ణి మట్టు బెట్టడం, తర్వాత కంసుణ్ణి చంపేఘట్టంలో కృష్ణపాత్రధారి నటన మామూలుగావుంది. కాని మిగిలిన వాళ్లంతా కృష్ణుని పరాక్రమాన్ని పొగుడుతూ పాటలు పాడుతూవుంటే మాత్రం గొప్పగా పొంగిపోతున్నాడు కృష్ణుడు!

ఒకప్రక్కగా నిలబడి నాటకం చూస్తున్నాడు రామకృష్ణ! ఏం బుద్ధి పుట్టిందో ఏమో నాటకం మధ్యలో వచ్చి కృష్ణపాత్రధారిని కవ్వంతో ఒక్కదెబ్బ వేశాడు. ఆదెబ్బకు అతను దిమ్మదిరిగి కుప్పకూలాడు. వెంటనే రామకృష్ణపాట నందుకున్నాడు.

"నీవా వీరుడవి? నీవా కాళీయుణ్ణి మర్దించావు?...."

"ఆహా ... ఏమి పరాక్రమము? నీవేనా కంసుణ్ణి చంపినది?"

"పనికి మాలినవాడా! నీవేనాకృష్ణుడివి?...."



సేవకులు పేర్చిన బంగారు ఇటుకలపై అడుగులు వేస్తూ, ఠీవిగా సభలో ప్రవేశించాడు రామకృష్ణ.

అని అర్థం వచ్చేవిధంగా పాటపాడుతూ వుంటే సభలోని వారంతా విరగబడి నవ్వటం ప్రారంభించారు! శ్రీకృష్ణదేవరాయలకు కూడా నవ్వు ఆగలేదు! నాటకం చూస్తూ విస్మగెత్తి వుండడంవల్ల రామకృష్ణపాట, అభినయం చూసి నవ్వుకున్నారంతా! సభలో చాలామంది నిద్రకి జోగుతున్నారు. రామకృష్ణుని హాస్యాభినయం, రక్తికట్టే పాటవినగానే వాళ్లు వుత్సాహంగా లేచి మళ్లీ నాటకం చూస్తున్నారు. నవ్వుతున్నారు...... వాళ్ల వుత్సాహం చూచి రామకృష్ణకి మరింత వుత్సాహంవచ్చింది.

మళ్లీ కృష్ణపాత్రధారిని కొట్టటానికి కవ్వం పైకెత్తాడు. ఒక్కదెబ్బకే పడిపోయిన అతను ఎలాగోలేవబోతూ రామకృష్ణ ఎత్తిన కవ్వాన్ని చూచి మరింత భయపడిపోయి, వెంటనే రామకృష్ణుని పాదాలమీద పడిపోయాడు. మళ్లీ అందరు గొల్లుమంటూ నవ్వారు.

వెంటనే అతన్ని లేవనెత్తి, "నీ పరాక్రమముగురించి గొప్పలు చెప్పకోవద్దు. అందరిచేత పొగడించుకోవటం మానెయ్యి. సకల జీవరాసులను రక్షించే ఆ కాళికామాతను ప్రార్థించు..." అంటూ చెప్పాడు రామకృష్ణ.

అసలే భయంతో బిగుసుకుపోయిన కృష్ణపాత్రధారి మరింత వణికిపోతూ, కాళీమాతను పొగుడుతూ పాటలు పాడటం ప్రారంభించాడు. మళ్లీ అందరూ నవ్వేశారు గొల్లుమని...

## "హాస్యకవి"

"తన హాస్యముతో మమ్మల్నంతా నవ్వించిన గోప బాలకుడికి ఒక ప్రత్యేక బహుమతి ప్రక టిస్తున్నాను" అని రాజుగారు అందరిసమక్షంలో ప్రకటించారు సంతృప్తిగా నవ్వుకుంటూ.

నాటక బృందానికి సారధ్యం వహిస్తున్న నాయ కుడు లేచి నిలబడి, చేతులు నలుపుకుంటూ, "మహాప్రభువులు క్షమించాలి! ఆ హాస్యగాడు మా నాటక బృందానికి చెందినవాడు కాదు. ప్రేక్షకు డని భావించాను. ఇందులో ఏదో మోసంవుంది. మీరు విచారణచేయాలి!" అన్నాడు భయంతో వణికి పోతూ.

"మహాప్రభూ! నన్ను క్షమించాలి! నేను నిజం గానే ఈనాటక బృందానికి చెందినవాడిని కాను. కాని మీ విసుగుదలను పోగొట్టటానికి ప్రయత్నిం

చాను" అని రామకృష్ణ ఎంతో వినయంగా చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

ఇదివిని శ్రీకృష్ణదేవరాయలకి కోపం వచ్చింది. "ఈ ద్రోహికి నూరు కొరడా దెబ్బలు విధిస్తున్నాను. ఇతనికివ్వవలసిన బహూమతి అదేకానివ్వండి!" అంటూ ఆజ్ఞాపించారు భటులను.

భటులు కొరడా దెబ్బలు కొట్టటానికి సిద్ధపడ్డారు.

"మహాప్రభూ! ఒక్క క్షణం ఆగాలి. ద్వార పాలకులిద్దరినీ ఒకసారి రప్పించాలి ప్రభూ!" అని రాజుగారిని వేడుకున్నాడు రామకృష్ణ.

అతని ప్రవర్తన వింతగా వున్నా, ఆభటులను వెంటనే రమ్మని రాజు ఆజ్ఞాపించారు. ఆ భటు లిద్దరు లోపలికి రాగానే రామకృష్ణ ఇలా అడిగాడు:

"రాజుగారిచ్చే బహూమానంలో మీరిద్దరికీ చెరి సగం పంచిఇస్తానని ప్రమాణం చేశానా లేదా?"

"అవును" అన్నారిద్దరు వెంటనే ఆశగా....

అప్పుడు రామకృష్ణ రాజుగారి నుద్దేశించి ఇలా అన్నాడు:

"వీళ్లమాటలు విన్నారు కదా మహారాజా! కొరడా

దెబ్బలు వీరిద్దరికీ సమానంగా పంచవలసిందిగా ప్రార్థి స్తున్నాను" ఆమాటలువినగానే ద్వారపాలకులిద్దరు నివ్వెరపోయారు. సభలోని వారంతా పెద్దపెట్టున నవ్వేశారు. రామకృష్ణదగ్గర లంచం అడిగినందుకు కొరడాదెబ్బలశిక్షేగాక రాజుగారి దృష్టికి ఆ విషయం తీసుకొచ్చాడు.

సూక్ష్మగ్రాహియైన శ్రీకృష్ణదేవరాయలు రామ కృష్ణ వింత చేష్టలకి నవ్వుతున్నా, దానివెనుక ఏదో వేరే ఉద్దేశ్యముంటుందని తలచి రామకృష్ణను నిల దీశారు!

"నీవు అందర్నీ బాగానే నవ్విస్తున్నావు కాబట్టి నిన్ను క్షమించాను. కాని ఇలా వేషంవేసుకుని సభమధ్యలో ప్రవేశించటానికి కారణం వేరే వుంటే వివరించమని అని అడిగారు.

అప్పుడు రామకృష్ణ తనకథనంతా మొదటినుంచి వివరంగా చెప్పి, "మీ అనుగ్రహం పొందటానికి ఇలా ప్రవర్తించానుప్రభూ!" అన్నాడు. ఆ కథంతా విని రాజుగారు రామకృష్ణని మెచ్చుకున్నారు.

"నీ ప్రవర్తనతో మాకు వినోదంతోపాటు కను విప్పు కల్గించావు. నీలాంటి వాళ్లు నా ఆస్థానములో

ఉండాలి. నా ఆస్థానములో ఏడుగురు పండితులు న్నారు. ఎనిమిదోస్థానం విదూషకులకోసమే వుంది. ఆ'స్థానం' నీవు స్వీకరించు" అని చెప్పి, కవులకు కావలసిన దుస్తులను తెప్పించి రామకృష్ణను సత్కరించారు రాజుగారు.

## ఆస్థానపండితుడు - కవి:

బాలలూ! ఆవిధంగా తెనాలి రామకృష్ణ శ్రీకృష్ణదేవరాయుల ఆస్థానములో చేరి, గొప్పపండితుడిగా, విదూషకుడిగా పేరు సంపాదించుకున్నాడు. గొప్ప హాస్యకవిగా కూడా రాణించాడు. అనేక గ్రంథాలు వ్రాశాడు. పంచమహాకావ్యాలలో ఒకటైన "పాండురంగమహాత్యము" రామకృష్ణుడు వ్రాసినదే. "ఘటికాచల మహాత్యము", "లింగపురాణం" అనే గ్రంథాలు కూడా వ్రాసి గొప్పపండితుడిగా, కవిగా పేరుపొందాడు.

అంతేకాదు! రాజుగారి సలహాదారుడిగా వుంటూ అనేక క్లిష్టసమస్యలను పరిష్కరించటములో ఓర్పు, నేర్పుకూడా ప్రదర్శించాడు. కొన్ని సమయాలలో గంభీరంగా వుండే వాతావరణాన్ని హాస్యోక్తులతో తేలిక పర్చేవాడు. సమస్యలతో సతమతమవుతున్న రాజు

గారిని సైతం తనదైన హాస్యధోరణిలో ఫక్కుమని నవ్వించగల్గే నేర్పు రామకృష్ణది!

స్వతహాగా విదూషకుడు కావటం వల్ల హాస్యాన్ని ఒక శక్తివంతమైన అస్త్రంలా ప్రయోగించి అహం భావాన్ని, గర్వాన్ని మూర్ఖత్వాన్నికూడా అణగ దొక్కవచ్చని నిరూపించాడు రామకృష్ణ! అతను చెప్పేకథలు, హాస్యోక్తులు అందర్నీ నవ్వించేవి! అత నికి ఎనలేని కీర్తిని, డబ్బుని తెచ్చిపెట్టాయి! లేకపోతే ఒకహాస్యగాడిని కృష్ణదేవరాయలు ఆస్థానకవిగా స్వీక రించేవాడేనా? ప్రజల మెప్పు అతడు పొందగలిగే వాడేనా???

మహా అయితే హాస్యకథలు విన్నప్పుడు మాత్రం అవి రామకృష్ణుని కథలుగా గుర్తించేవారు!

చాలా కథలు రామకృష్ణ వ్యక్తిత్వాన్ని, పరా క్రమాన్ని చాటిచెప్పేవి. అతను బోధించే తీరు కొందరికి కనువిప్పు కల్గించేది! ఆకథల్లో కొన్ని చెప్పు కుందాం!

## కాశీపండితుని గర్వభంగం:

ఒకసారి ఒక పండితుడు కాశీనుండి గొప్ప అట్ట

హాసంగా తన శిష్యులను వెంటబెట్టుకుని విజయనగ రానికి వచ్చాడు. అతడు ఉత్తరభారతదేశమంతటా పర్యటించి, అనేకమంది పండితులను, హేమాహేమీ లను వేదాలలో, ఉపనిషత్తులు, శాస్త్రవిషయాలలో చర్చలకు ఆహ్వానించి ఓడించాడు. అతనిని రాజు గారు సాదరంగా ఆహ్వానించి అతిథి గృహంలో విడిది ఏర్పాట్లుచేశారు.

మర్నాడు సభలోకి ఆ పండితుడు డంబముగా ప్రవేశించాడు. వస్తూనే రాజుగారినుద్దేశించి, "మహా రాజా! మీకొలువులో కాకలుతీరిన పండితులున్నారని విన్నాను. వారిని చర్చలకు ఆహ్వానిస్తున్నాను. వాళ్లు గనక నన్ను ఓడిస్తే నాబిరుదులన్నీ వారికిచ్చివేస్తాను. వాళ్లు ఓడిపోతే నన్ను గురువుగాస్వీకరించినట్లు లిఖి తపూర్వకంగా ఇవ్వాలి" అన్నాడు ఎంతో దర్పంగా, అతిశయంగా! అతని మాటల్లో తప్పకగెలిచితీరుతా నన్న నమ్మకం, తనని ఓడించేవారెవరూ లేరన్న ధీమా వ్యక్తమయింది! అతనికున్న బిరుదులు, ఆడంబరం చూచి సభలోని పండితులంతా అయోమయంలో పడిపోయారు.

"పండితోత్తమా! ఈపోటీని మనం రేపు నిర్వహించుకుంటే బావుంటుందేమో?" అని

కృష్ణదేవరాయలనగానే అతడు అందుకంగీకరించాడు. తర్వాత అతనిని అతిథి గృహానికి పంపివేసి, పండితులందరిని పిలిచి, "అయితే రేపు అతనితో పోటీకి దిగేవారెవరు?" అంటూ ప్రశ్నించారు కృష్ణదేవరాయలు. కాశీపండితుని ఆర్భాటం, అతని విజయాలు, బిరుదులు చూచి భయపడిపోయిన ఆస్థాన కవులు ఏమీమాట్లడకుండా తలలువాల్చేశారు!!

రాజుగారికి భలే కోపం వచ్చింది.

"నా ఆస్థానంలో వున్న పండితుల సామర్థ్యం ఇంతేనా?" కోపంగా అని అక్కడ నుండి వెళ్లిపోయారు. అప్పుడు రామకృష్ణ లేచి,

"రాజుగారి పరువుప్రతిష్టలు నిలబెట్టలేని మనం బ్రతికివుండడం శుద్ధదండుగ. నేను అతనితో పోటీకితల పడతా"నని చెప్పాడు.

ఆమాటలు వినగానే ఆఏడుగురు పండితులు ఎంతో సంతోషంగా తమ బిరుదులను రామకృష్ణునికిచ్చివేసి, అతని శిష్యులుగా వుంటామని చెప్పారు. ఆరోజు నుంచి రామకృష్ణ వాళ్లకి గురువు! కృష్ణదేవరాయలు రామకృష్ణుని నిర్ణయం గురించి తెలుసుకుని ఆశ్చర్య

కోరిన విధముగా పోటీకి కావలసిన ఏర్పాట్లన్నీ చేశారు.

మరునాడు రామకృష్ణ పండితుడి వేషంలో గొప్ప అట్టహాసంగా సభలోకి ప్రవేశించాడు. కాశ్మీరు పట్టుతో నేసిన ధోవతి కట్టి, పైన పువ్వులు కుట్టేన శాలువా కప్పుకున్నాడు. దానిపైన వరుసగా రాజులు, ప్రజలు, పండితులిచ్చిన బిరుదులు, పతకాలన్నీ (వజ్రాలతో మెరుస్తున్నాయవి!) తగిలించుకున్నాడు. నుదుట సింధూరం చుక్కతోపాటు తెల్లని విభూతి రేఖలు! ఠీవిగా లోపలికి వస్తున్నాడు— ఎలాగా? అతనికి ముందుగా ఏడుగురు పండితులు అతనికీర్తి ప్రతిష్ఠ లని, బిరుదులను పొగుడుతూవుంటే— భటులు వచ్చి ఒక్కొక్క బంగారు ఇటుకను పెడ్తూవుంటే ఒక్కో అడుగు ఆయిటుక మీద వేస్తూ హుందాగా, దర్పంగా వెన్ను విరుస్తూ లోపలికి వచ్చాడు రామకృష్ణ!

కాశీపండితుడు దిగ్భ్రాంతి చెంది చూస్తున్నాడు.! రామకృష్ణుడి చేతిలో పట్టువస్త్రం కప్పిన గ్రంథమేదో వుంది. ఆగ్రంథాన్ని ఒక బల్ల మీద జాగ్రత్తగావుంచి చుట్టూ కలియచూశాడు!

"నాతో వాగ్వివాదానికి సిద్ధంగా ఎవరో పండి

తులు వచ్చారని విన్నాను? ఎవరో ముందుకురండి" ఎంతో గర్వంగా ఆహ్వానించాడు రామకృష్ణ!

"నే.. నేనే... ఆ మ...ని...షిని..." (పండితుడనని కూడ చెప్పలేకపోయాడు) అన్నాడు ఆకాశీ పండితుడు. దిగ్భ్రమనుండి కోలుకోలేదు అతడింకా.

"ఇక ఆలస్యందేనికి? చర్చలు ప్రారంభించ"మన్నారు రాజుగారు. వెంటనే రామకృష్ణ లేచాడు ఠీవిగా ... చూపుడు వ్రేలితో తాను తెచ్చిన గ్రంథాన్ని చూపించాడు!

"ఈ గ్రంథం పేరు తిల...కాష్ఠమహిష-బంధన. ఈగ్రంథముతోనే మన చర్చ సాగుతుంది" అన్నాడు.

అప్పటికే భయంతోవళ్లంతా చెమటలు పట్టిన కాశీపండితుడు మరింత కంగారు పడిపోయాడు. ఎన్నోగ్రంథాలు చదివాడుగాని ఈగ్రంథము పేరు ఎక్కడావినలేదు! ఇక చర్చకి ఎలా దిగుతాడు?... ఆ విషయం బయటికి చెప్పకుండా కృష్ణ దేవరాయల నుద్దేశించి ఇలా అన్నాడు.

"మహారాజా క్షమించాలి! ఈగ్రంథం గురించి ఎప్పుడోచదివాను. ఈ రాత్రికి ఒకసారి మననం చేసుకుని రేపు చర్చకి దిగుతాను" అని చెప్పి వెంటనే

తన శిష్యులతో అక్కడినుండి జారుకున్నాడు.

రాత్రంతా మేలుకుని, తానుచదివిన గ్రంథాలను పరిశీలించాడు. "తిలకాష్ఠ...." గురించి ఎక్కడా పేరు కన్పించలేదు. ఆపేరు వినలేదుకూడా! అదో అర్థంకాని పొడుపుకథలా వుంది! పోటీకి దిగితే అవమానం తప్పదు అనుకుని రాత్రికి రాత్రే విజయనగరం వదిలి ఉడాయించాడు ఆ పండితుడు!

కాశీపండితుడు చెప్పకుండా వెళ్లిపోవటం కృష్ణదేవరాయలకి విస్మయం కల్గించింది. అంత గొప్ప పండితుడు గర్వంగా సవాలు చేసి, చివరికి పోటీకి దిగకుండానే వెళ్లిపోవటం ఆశ్చర్యమే! రామకృష్ణుని పిలిపించారు వెంటనే.

"ఆ గ్రంథము పేరు వినే ఆయన భయపడినట్లుగా వున్నాడు. ఆగ్రంథమేమిటో చూడాలని ఆత్రుతగా వుంది. ఒకసారి తీసుకుర"మ్మనారు.

గ్రంథానికి కప్పివుంచిన పట్టువస్త్రాన్ని తొలగించాడు రామకృష్ణ. అక్కడ గ్రంథమేదీ లేదు. అట్టపెట్టలో ఒక త్రాడుముక్క, ఒక కర్ర మాత్రం వుంది!? ఆశ్చర్యంగా చూస్తున్నారు రాజుగారు.

"మహాప్రభూ! క్షమించాలి! ఇది గ్రంథము

కాదు- ఇది నువ్వుచెట్టు యొక్క కర్రముక్క- తిలకాష్ఠం! గేదెనుకట్టే తాడుముక్కతో ఆకర్రను కట్టివుంచాను. అలా వుంచానని సంస్కృతంలో చెప్పానంతే! తిలకాష్ఠ మహిష(గేదె) బంధన (కట్టి వుంచటం)- అర్థం తెలియక ఆ పండితులుకంగారు పడిపోయారంతే ప్రభూ!" అన్నాడెంతో అమాయ కంగా. రామకృష్ణ వర్ణిస్తుంటే రాజుగారికి నవ్వాగలేదు.

రామకృష్ణ తెలివితేటలకి సంతోషించి, ఘనంగా సత్కరించారు!

## అత్యాశకు గుణపాఠం:

అమాయకంగా కనిపించే రామకృష్ణ హాస్యకవిగా విదూషకుడిగా రాజుగారితోపాటు ప్రజలందరి ఆదా రాభిమానాలను పొందాడు. అన్యాయన్ని ప్రతిఘటిం చేవాడు. తనదైన హాస్యపు ధోరణిలో నాటకమాడి చక్కదిద్దేవాడు. న్యాయం జరిగేలా చూచేవాడు.

శ్రీకృష్ణ దేవరాయల తల్లి మూఢవిశ్వాసాలు కల్గినది కావటం వల్ల ఎప్పుడూ పుణ్యకార్యాలలో మునిగి వుండేది. పుణ్యక్షేత్రాలు దర్శించటం, దాన ధర్మాలు చేయటం ఆమెకి అలవాటు. "అన్ని

దానాలకన్న ఫలదానం ఉత్తమమైనదని తెలిసి ఫల దానం చేయాలని, పండ్లు తెప్పించమని కృష్ణ దేవరాయలుకి చెప్పింది. ఆయనకి తల్లి అంటే గొప్ప ప్రేమ. వెంటనే భటులను పంపించి రత్నగిరి నుండి శ్రేష్టమైన మామిడి పండ్లను తెప్పించారు. అయితే ఆ పండ్లు దానం చేయకుండానే ఆమె హటాత్తుగా మరణించటం జరిగింది!

ఆమె కర్మకాండలన్నీయధావిధిగా అయ్యాయి. అవి ముగిసేలోపల తల్లి చివరికోర్కె తీర్చాలని అనుకున్నారు రాజుగారు. బ్రాహ్మణులనురప్పించి, తల్లి కోర్కెనుగురించి చెప్పి, ఫలదానం చేసిన పుణ్యం ఆమెకి దక్కాలంటే ఏంచేయాలో చెప్పమన్నారు.

పురోహితులకు దురాశ పెరిగింది. ఎంత ఖర్చయినా రాజుగారు వెనుదీయరని తెలుసువాళ్లకి. అందుకని బంగారు మామిడిపండ్లు చేయించి దానం చేస్తే, దానంచేసిన పుణ్యంతోపాటు ఆమె ఆత్మకు శాంతి చేకూరుతుందని చెప్పారు. ఆఏర్పాట్లు జరిగిపోతున్నాయి ఘనంగా...

రామకృష్ణకి తెలిసిందీ విషయం! మర్నాడు పురోహితుల ఇళ్లకివెళ్లి "అదే రోజున మాఅమ్మగారికి

కూడా శ్రాద్ధకర్మలు చేయాలి. ఆరోజున మీరు రాజు గారిదగ్గర దానం పుచ్చుకుని, మాయింటికి రండి. మా అమ్మగారి ఆఖరి కోర్కె తీర్చాలి నేనుకూడా!" అని చెప్పాడు అందరికీ.

ఆరోజున బంగారు మామిడి పండ్లను దానంగా పుచ్చుకుని, సంతోషంగా ఒక్కరొక్కరే రామకృష్ణఇంటికి చేరుకున్నారు. తల్లిపేరున రామకృష్ణ ఏదైనా దానం చేస్తాడని ఎదురు చూస్తున్నారంతా! అందరూ రాగానే ఇంటికున్న తలుపులన్నీ మూసివేశారు పని వాళ్లు. ఎఱ్ఱగా కాల్చిన ఇనుపకడ్డీలను పట్టుకుని వాళ్లంతా బ్రాహ్మణుల దగ్గరికి వచ్చారు! బ్రాహ్మణులంతా భయంతో వెనకడుగువేశారు. అప్పుడు రామకృష్ణ వాళ్లనుద్దేశించి ఇలా అన్నాడు.

"బ్రాహ్మణోత్తములారా! మాతల్లిగారు నరాల వాతపు జబ్బుతో చనిపోయారు. ఒకరోజు ఆనొప్పిని భరించలేక నన్ను పిల్చి, ఎఱ్ఱగా కాల్చిన ఇనుపకడ్డీతో వాతలు పెట్టమని కోరింది. అలా వాతబెడితే నొప్పి తగ్గుతుందని ఆమె చెప్పటం వల్ల నేను ఇనుపకడ్డీలను కాల్చి తీసుకొనివచ్చాను. ఆమె చివరికోరిక తీరకుండానే ఆమె చనిపోయింది. అందువల్ల ఇపుడీ

వాతలు మీకు పెట్టి, మాతల్లిగారి ఆత్మకు శాంతి చేకూర్చాలి" అని చెప్పి ఎఱ్ఱగా కాల్చిన కడ్డీలను పట్టుకుని, బ్రాహ్మణుల దగ్గరికి రాసాగాడు.

బ్రాహ్మణులంతా గట్టిగా కేకలు పెడ్తూ, ఏడుస్తూ అటూ ఇటూ పరుగెత్తడం ప్రారంభించారు.

"ఇది అన్యాయం రామకృష్ణా! అతిథులుగా వచ్చినవారిని ఈవిధంగా అవమానించటం తగదు" అన్నారు ఏడుస్తూ.

"ఇందులో అన్యాయంగాని, అధర్మంగాని ఏమీ లేదు. రాజుగారి తల్లి చివరికోర్కెను తీర్చటానికి మీరుబంగారుమామిడిపండ్లను తీసుకోలేదా? అదే విధంగా నాతల్లి కోరికను తీర్చమంటున్నాను" అన్నాడు రామకృష్ణ.

అప్పుడు జ్ఞానోదయమైంది ఆబ్రాహ్మణులకు తమ దురాశకి తామే సిగ్గుపడ్డారు. రామకృష్ణని క్షమించమని వేడుకున్నారు. తాముదానంగా తీసుకున్న ఆబంగారు మామిడిపండ్లను రామకృష్ణ ఇంట్లోనే వదిలి వెళ్లిపోయారు. తర్వాత ఆపండ్లను రాజుగారి ఖజానాకి తరలించటం జరిగింది.

ఆ విషయం విన్న రాజుగారు రామకృష్ణనుపిలిచి,

"బ్రాహ్మణులను అలా ఎందుకు అవమానించావు?" అనడిగారు.

"మహాప్రభూ! ప్రభుత్వ ధనాన్ని వృధాగా ఖర్చు పెట్టడం సహించలేకపోయాను. ఆనిధులు ప్రజల మేలుకోసం ఉపయోగపడాలి!" అన్నాడు.

రాజుగారికి గుణపాఠం చెప్పటానికి కూడా అతడు జంకేవాడు కాదు. ఒకసారి కృష్ణదేవరాయలు తన అష్టదిగ్గజాలు(పండితులు) వెంటరాగా కొత్తగానిర్మించిన జలాశయాన్ని చూడటానికి వెళ్లారు. విశాలంగా పరుచుకున్న ఆజలరాశిని చూచి,

"ఈ జలాశయంలో నీళ్లెలా వున్నాయి?" అనడిగారు.

"స్వచ్ఛంగా, స్ఫటికంలా మెరుస్తున్నాయి!" అని ఒకరు, "వనదేవతస్వచ్ఛమైన మనస్సులా వుందని" మరొకరు, ఇలా ఎవరికి తోచినట్లుగా వాళ్లు చెప్తుంటే, రామకృష్ణని చెప్పమని అడిగారు రాజుగారు.

పొగడ్తలు, వర్ణనలజోలికి పోకుండా రామకృష్ణ సూటిగా ఒకే ఒక్కమాటలో జవాబు చెప్పాడు.

"మహాప్రభూ! మీరుజలాశయం కట్టించారు కాబట్టి ఈ జలం ఇక్కడ వుంది". ఆ సమాధానం

విని రామకృష్ణని ఎంతో మెచ్చుకున్నారు రాజుగారు.

## తల దాచుకోవటం:

ఒకరోజు రామకృష్ణ అంతఃపురంలోని గోడలమీద కొత్తగా చిత్రించిన కొన్ని చిత్రాలను ఆసక్తిగా చూస్తున్నాడు.. అందులో ఒక దేవకన్య బొమ్మకి సరిగ్గా దుస్తులను వేయలేదని తోచింది రామకృష్ణకి. వెంటనే రంగులు, కుంచె తీసుకుని దుస్తులను సరి చేశాడు.

సరిగ్గా అప్పుడే అక్కడికి ప్రధానమంత్రి రావటం, రామకృష్ణని కోపగించటం జరిగింది.

"రామకృష్ణా! బుద్ధిలేని పనిచేశావు? రాజుగారు దగ్గరుండి ప్రత్యేకంగా ఈ చిత్రాలను వేయించారు. ఆబొమ్మనిపాడు చేశావని తెలిస్తే కోపంతో నిన్ను కఠినంగా శిక్షించక తప్పదు. శిక్షపడకముందే నీతలను ఎక్కడైనా దాచుకో...." అని కేకలు వేశాడు.

మర్నాడు రాజద్వారము వద్ద ఒక వ్యక్తి రాజదర్శనం కోసం వేచివున్నాడని తెలిసి కృష్ణదేవరాయలు అక్కడికి వెళ్లారు. ముఖం కన్పించకుండా తలను

ఒక మట్టికుండలో దాచుకున్న ఆవ్యక్తిని ఆశ్చర్యంగా చూస్తూ,

"ఎవరు నువ్వు? కుండలో ముఖం దాచుకున్నావెందుకని" అడిగారు. "మహాప్రభూ! నేను రామకృష్ణని. నావల్ల చిన్నతప్పు జరిగిపోయింది. ప్రధానమంత్రివర్యులు, మీరు నాతల తీయించకుండా దాచుకోమని చెప్పారు అందుకుని..." అంటూ నసిగాడు.

ప్రధానమంత్రి వెంటనే జరిగినదంతా రాజుగారికి వివరించి చెప్పాడు. రామకృష్ణ తెలివిగా ఆడిన నాటకం వల్ల మరోసారి క్షమించి వదిలివేశారు రాజుగారు!

## రామకృష్ణుని కుటుంబం:

రామకృష్ణ భార్యచాలామంచిది. అతని మంచితనం, ఔదార్యం తెలిసినదై వుండటంవల్ల భర్తకనుగుణంగా నడుచుకునేది.

రామకృష్ణకోసం రాజుగారు చక్కని పెద్దయిల్లు కూడా కట్టించిఇచ్చారు. చేతిలో తగినంత డబ్బు లేకపోయినా రాజుగారినడిగేవాడుకాదు రామకృష్ణ.

ఆత్మాభిమానం గలవాడు. కాబట్టి రాజుగారి నెపుడూ యాచించలేదు.

ఒకసారి కృష్ణదేవరాయలు మారువేషములో నగర సంచారానికి బయలు దేరినప్పుడు రామకృష్ణ ఇంటివైపు వెళ్లడం తటస్థించింది. రామకృష్ణ ఏంచేస్తున్నాడో చూద్దామని కిటికిలోంచి తొంగి చూశారు రాజుగారు.

రామకృష్ణ తిరగలి ముందు కూర్చుని పిండి విసరటం కన్పించింది! రామకృష్ణ అంతటి పేదరికంలో వున్నట్లు గ్రహించిన కృష్ణదేవరాయలు ఆనెలనుండి అతనికిచ్చే జీతభత్యాలు పెంపుచేశారు.

రామకృష్ణ భార్య చాలా తెలివైనది! ఒక రోజు దొంగలు వారింట్లోకి ప్రవేశించారు. పెద్ద యిల్లు, రామకృష్ణుని పేరు ప్రఖ్యాతులువిన్న ఆదొంగలు ఆయింట బాగాడబ్బు వుంటుందన్న ఆశతో వచ్చారు. పెరటిలో ఓమూల నక్కి వున్నారు. ఆ దొంగలు అక్కడవుండడం రామకృష్ణ పసికట్టాడు. ఆసంగతి భార్యచెవిన వేశాడు. తెలివిగా ఒక ఉపాయం ఆలోచించారు భార్యాభర్తలు. తర్వాత ఇద్దరు గట్టిగా మాట్లాడుకున్నారు.

"ఊళ్లో దొంగలభయం ఎక్కువగా వుంది" మన

యింట్లోవున్న విలువైన వస్తువులన్నీ పెట్టెలో పెట్టి, పెరటిలోవున్న నూతిలో దాచుకుంటే బావుంటుం దేమో?" అన్నాడు రామకృష్ణ

"అలాగే" నన్నది భార్య - వాళ్లసంభాషణ దొంగలు కూడావిన్నారు. భార్యాభర్తలిద్దరూ తెలి విగా ఒక పెట్టెతెచ్చి అందులో రాళ్లు రప్పలువేసి మూతపెట్టి, ఇద్దరు ఆపెట్టెను పెరట్లోకి తీసుకెళ్లి. నూతిలో పడవేశారు. నూతిలో దబ్బున పడిన చప్పుడు విని, "నగలన్నీ పెట్టెలో పెట్టి నూతిలో పడవేశారు. ఆపెట్టెను ఎలాగైనా దక్కించుకుంటే చాలని" ఆ దొంగలు తలిచారు.

ఆరాత్రంతా ఆ దొంగలు నూతిలోని నీరంతా తోడిపెరట్లో పోస్తున్నారు. పెరట్లోవున్న మొక్క లన్నిటికీ పుష్కలంగా నీరు దొరికిందని రామకృష్ణ సంతోషించాడు. వెంటనే "ఇక తోడటం చాలిం చండి, మొక్కలన్నిటికీ నీరు సరిపోయింది!" అంటూ కేకలు పెట్టాడు. కేకలు విన్న దొంగలు పారిపో యారు. రామకృష్ణ తన పాచిక పారినందుకు చాలా సంతోషించాడు.

రామకృష్ణునికి భాస్కర శర్మ అనే ఒక కొడుకు



రాళ్ళతో నిండిన పెట్టెను వారు బావిలో పడవేశారు.

వున్నాడు. అతడు తండ్రిలాగే తెలివైనవాడు, కుశా గ్రబుద్ధిగలవాడు. తండ్రికి అన్నివిధాల చేదోడు, వాదోడుగా వుండేవాడు. అహంకారులకి బుద్ధిచెప్పే సమయంలో తండ్రికి పెక్కుసార్లు సహాయపడ్డాడు.

## దురుద్దేశ పూరితం కానిది, అతని హాస్యం:

తెనాలి రామకృష్ణుని జీవితం గురించి విన్నప్పుడు ఎంతో అద్భుతంగా అనిపిస్తుంది. చిన్నతనంలోనే తండ్రిని పోగొట్టుకున్న అభాగ్యుడు! ఊళ్లో వున్న గురువుల సంకుచిత స్వభావము వల్ల విద్యనభ్యసించలేక పోయిన దురదృష్టవంతుడు! ఎంతో ప్రయాసపడి, దీక్షగా తపస్సు చేసి కాళికాదేవిని ప్రసన్నంచేసుకుని విద్యావంతుడయ్యాడు. హాస్యసంభాషణతో కాళీమా తను కూడా నవ్వించి పండితుడిగా, హాస్యకవిగా వరములు పొంది శ్రీకృష్ణదేవరాయల ఆస్థానములో చేరి గొప్పపేరు సంపాదించాడు.

అతని హాస్యము దురుద్దేశపూరితంగా, ఇతరు లను నొప్పించేదిగా వుండేదికాదు. గర్విష్ఠులకు ఒక గుణపాఠం నేర్పించింది, అహంకారులకు కనువిప్పు కల్గించింది. పండితుడుగాని, మంత్రిగాని, ఆఖరికి రాజుగారైనా సరే తప్పుచేస్తే, ఆతప్పుని హాస్యభాష

ణద్వారా తెలుసుకునేలా చేసేవాడు.

జీవితం ఎంత ఒడిదుడుకులతో కూడుకున్నదైనా అప్పుడప్పుడు హాయిగా నవ్వటం కూడా అవసరం! హాయిగా నవ్వినప్పుడు మనస్సులోని బాధలుతగ్గి తేలి కపడుతుంది. ఇతరుల మనస్సుని నొప్పించే విధంగా ఎప్పుడూ నవ్వకూడదు. ఎదుటివారిని చూచిన వ్వినా, చేసిన తప్పు తెలుసుకుని సవరించుకోగల్గాలి!

హాస్యము మృదు మధురంగా, స్నేహపూరితంగా వుండాలి. రామకృష్ణుని హాస్యము కూడా ఆకోవకి చెందినదే!

* * *